పండితోత్తములారా !

ఏతద్గ్రంథమును నీకవిని గుఱించి సూక్ష్మముగాఁ బ్రశం
సించఁదలంచితి, నాదరాయత్తచిత్తులై యామోదింతురుగాత.

"భగవత్సృష్టిసంబంధమైన చేతనంబులలో మనుష్య
జన్మం బుత్కృష్టంబు; యందును వ్యక్తిగలిగి సంచరించుట
కడు శోచనీయంబు; మఱియు లోకంబున జన్మించినదాది సకల
విద్యాపరిపూర్ణుఁడై జ్ఞానశక్తివంతుఁడై భక్తియుక్తిత్వమునఁబర
మేశ్వరధ్యానశీలుఁడై వెలయుట పూర్వసంచితఫలంబుగదా?
గాన నశ్లేనీకవియు క్వచిద్వయోప్రాయంబునను ననన్యకళా
పారంగతుడై దనసామర్థ్యమునకుఁ దగినట్లు "శ్రీగోపాలనక్షు
త్రమాల" యనునీచిఱుగోత్తమునొండు రచియించి కృతకృ
త్యుఁడయ్యె; నిందలి పద్యంబులును ముద్దులుఁగులుకు తేటఁ
తెల్లనగు నచ్చతెలుఁగు పలుకులచే ద్రాక్షాపాకకలితంబుగా
వీనుల కింపైపై విలసిల్లుచుండెనైనను నిది ప్రాథమిక కవిత్వరచ
నయు చిన్నతనమునఁ జెప్పినదగుట నక్కడక్కడఁ బునరుక్తి
పదసంధి యర్థసందర్భము ప్రాస విశ్రమాదిదోషములుఁగలవు
గాని యన్నియు సాధ్యమైనంతవరకు పరిశీలింపఁబడియె.

"శ్లో॥ ప్రమాదో ధీమతామపి" యనురీతి నెట్టివారికేని
లోపములుండుట సహజంబగు నదియునుంగాక మ॥ ........

ప్రాజ్ఞులార ! నిరసించంబోకుఁడీ రాఘవే, శ్వరుచారిత్రము నెందఱెన్నిగతులఁ వర్ణించినఁ గ్రాలదే? ..............
యనునట్లు దేవతా నుతిపూర్వకమైన గ్రంథముగాన నట్టి యాచంద్రార్క స్థాయిగా వర్థిల్లునుగాత ! కీర్తి శేషుఁడగు నీకవితత్వమునకు యాభగవంతుఁడు చల్లనిచూడ్కిచేత నుస్థిరత్వముఁగలుగజేయుగాత. మరియు నీకవికి బంధువులును యీమనిగ్రామనివాసులగు కన్నెగంటి వెంకటనారాయణగారి ద్రవ్యసహాయమునను యీగ్రామ మునసబుగారగు అంచె శివయ్యగారి ప్రోత్సాహమువల్లను యీగ్రంథ ముద్రణము నిర్వహింపఁబడియె. వీరి కిట్టులనే భాషాభిమానమును గలుగఁజేయుటకై భగవంతుఁడు దోడ్పడుఁగాక.

ఇట్లు,

కవి చింతపల్లి రామకృష్ణమూర్తిశాస్త్రి.

యీమని, తెనాలితాలూకా

బ్రహ్మశ్రీ చింతపల్లి రామకృష్ణమూర్తి శాస్త్రిగారు యీగ్రంథమును ముద్రించుట కనుకూలముగా వ్రాసి మాకొసంగి సహాయమొనర్చినందులకు వారికెంతయు కృతజ్ఞులము.

ఇట్లు విధేయుడు,

ఏతద్గ్రంథప్రకాశకులు,

కన్నెగంటి వెంకటనారాయణచౌదరి.



శ్రీ గురుభ్యోనమః.

# శ్రీగోపాలనక్షత్రమాల.

---

ఇష్టదేవతా ప్రార్థనాదికము

—* శ్రీ సరస్వతీ స్తోత్రము *—

సీ॥ వదనారవింద సం♦వాసియౌ భ్రమరంబు
కరణి మోమునఁ దిల♦కంబుదనరఁ
గరికరోపమమైన ♦ కచభరంబల్లనఁ
దగు సౌరునను, కటీ ♦ తటినటింప
సకలసంగీత శా♦స్త్రనికేతనంబైన
వల్లకి కరపల్ల♦వమునఁదనర
రమణీయరత్న వి♦భ్రాజిత మేఖలా
వలయంబు లలిత ర♦వంబులెసఁగ
తే॥ గీ॥ సర్వభూషణనినదముల్ ♦ సందడింపఁ
దను లతాకాంతి దిశలెల్ల ♦ దళముకొనఁగఁ

జెలఁగి చిఱునవ్వు లయ మీఱు • నలువరాణి
చెలఁగి భక్తుల నెప్డు ర•క్షించుగాక॥

—* శ్రీరామ స్తవము *—

చ॥ రమణి! సువర్ణశైలమతి•రమ్యముగా గురువర్ణమొప్పెడిన్
నమల నఖాంకురాశ్రయత•నొనని; నర్మముగాఁగఁబల్కఁదాఁ
గమలదళాక్షి! సీత! తన • కంచుకమున్ సవరింప సిగ్గునన్
ప్రమదముఁజెందునట్టిరఘు•రాముఁడొసంగుతమాకభీష్టముల్॥

కం॥ మురహర! నరసఖ! కరినుత!
కరుణాకర! భక్తవరద! కౌస్తుభవక్షా!
గిరిభిన్ముఖ సంరక్షా!
ఖరకరసోమాక్ష! నక్రగర్వవిపక్షా!॥

—* శ్రీ శివస్తవము *—

చ॥ జలజనిభాక్షి కో? రజత • శైలశిఖోపరిభాగమందునన్
జలదమొకో?లసన్మదగ•జంబొకొ?నాఁదగెఁగంటె?నీలిమన్
లలన!యనంగ;నప్పు డతి•లజ్జవహించియుచారుపద్మోదన్
బాలుపుగఁగూర్చుగారినిఁగ•వుంగిటఁజేర్చు;యుమేశుగొల్చెదన్

—* శ్రీ గురుస్తుతి *—

కం॥ వినుతి నొనర్చెద; మద్గురు
ఘనతర విద్వత్సుమేరుఁ! • గవితాధారున్

మనమున సంతసమలరఁగ
ననఘుని! గుడిపూడి పూర్ణయాఖ్యునిఁ దోలుత౯॥

—* శ్రీసుకవి (విజ్ఞాపనము) *—

ఉ॥ వారిని నేర్చి; క్షీరమున ♦ వారిత మానసమైన యంచ; వే
ఱేరఁగఁదీయుమాడ్కి—; మది♦సిద్ధమటంచుఁదలంచి; మీరు;వి
స్తారములైన వాక్యముల♦సంహతిఁ బాపి రసాస్పదోక్తులిం
పారగ్రహించినన్నుఁబరిఁపాలనఁజేయుఁడు; సత్కవీశ్వరుల్॥

—* కవి స్వప్న వృత్తాంతము *—

సీ॥ కలువలఱేని నొక్కసమాడు చిన్నారి,
మోమునఁ జిఱునవ్వు ♦ మొలక లెత్తఁ
గాదమ బెబ్బులిగోరు ♦ నెదను శోభిలుచుండఁ,
బలుముత్తియపుసరుల్ ♦ పరిఢవిల్ల
మొలఁజుట్టు బంగారు ♦ చెలువొందు మొలత్రాటఁ,
జిఱుగజ్జ లెల్లనుఁ ♦ జెలఁగి మ్రోవఁ
దోరంపుఁబచ్చరా ♦ తోడవులు మెఱయంగ
సికను పింఛెఁపుదండ ♦ చెల్వుమీఱఁ

తే॥ గీ॥ గేలుఁగవఁ బిల్లఁగ్రోవినిఁ ♦ గీలుఁగొల్పి
పదములందున నందియల్ ♦ రొదలొనర్ప
బసిఁడి దువ్వల్వ వ్రేల; గో ♦ పాలబాలుఁ
డలమిఁగలలోనఁ బొడఁజూపి ♦ యిట్లులనియె॥

—* శ్రీ భగద్వాక్యము *—

మ॥ వినుమోరామకవీ! మదీయకృతిఁగా • వేగంబె నీవిప్పుడుర్
గనకక్షాపిత తారహారముగఁ దీర్ • గావించి కబ్బంబు; స
ద్వినయంబొప్పఁగ నాకు నర్పణము; భ • క్తిం జేసియున్; నీవు; స
ద్ధన ధాన్యంబులుఁగల్గి మత్కరుణచే • ధాత్రిన్ శుభంబాదుమీ॥

వ. యివ్విధంబున యానతిచ్చి శ్రీకృష్ణదేవుం డంతర్హితుండ యిననంత మేల్గాంచి భగవద్దర్శనంబునకు హర్షోత్కర్షుండనై; తదుపరి యీ నక్షత్రమాల నొనగూర్చితి.

శ్రీ పంచవక్త్ర వీర హనుమతే నమః.

శ్రీగోపాలనక్షత్రమాల

ప్రారంభము.

సీ॥ శ్రీమానినీమణి • చిత్తసారసభృంగ!
చంద్రార్ధధరహిత • శౌర్యసంగ!
వదననిర్జితసోమ! • వైరివర్గవిరామ!
సుజనవందితనామ! • సుగుణధామ!
సకలమానీశ్వర • స్తవనీయసత్పాద!
కంజాప్తశశినేత్ర! • కంధజైత్ర!
శకటదైత్యవిభంగ! • శయధృతగిరిశృంగ!
పన్నగారితురంగ! • పాండురంగ!

తే॥ గీ॥ దాసజనతోష శ్రీరామ ♦ దాసపోష !
నన్ను దయయుంచి బ్రోవుమో ♦ నవ్యభూష !
పరమమునిపోషరావికం ♦ పురనివాస
పాకవైరినుతాంఘ్రి గో♦పాలకృష్ణ॥ 1

సీ॥ నెత్తమ్మిపూచూలి ♦ నెలతనువినుతించి ;
కొక్కుతత్తడిరౌతుఁ ♦ గొలిచి కొలిచి ;
పుట్టబుట్టినవాని ♦ బాగుగా సేవించి ;
సాత్యవతేయుని ♦ సన్నుతించి ;
నన్నయభట్టుఁ, దిక్కన్నఁ ♦ బోతన, నెఱ్ఱ
ప్రగడాదిసుకవులఁ ♦ బ్రణుతిఁ జేసి
కుకవులనెల్లనుఁ ♦ గొండాడి; సుకవులఁ
గైవారమొనరించి ♦ కడుముదమునఁ

తే॥ గీ॥ జేయబూనితినీకృతిఁ ♦ జిత్తగింపు;
శ్రితజనానంద ! గోవింద ! ♦ శ్రీముకుంద !
పరమమునిపోషరావికం ♦ పురనివాస
పాకవైరినుతాంఘ్రి గో♦పాలకృష్ణ ! 2

సీ॥ ఆంధ్రప్రబంధంబు ♦ లరయఁజూడఁగలేదు,
పంచకావ్యములుఁ బఠించలేదు,
సకలశాస్త్రపురాణ ♦ సంగతుల్ వినలేదు,
కవితావిచారంబుఁ ♦ గాంచలేదు,

శ్రీగోపాల నక్షత్రమాల



వరచిత్రకవితాది • వర్ణనల్ గనలేదు,
సర్వలక్షణములఁ • జదువలేదు,
యనఘులసాంగత్య • మభ్యసించఁగ లేదు,
సమయంపుఁబలుకుల • జాడలేదు,
తే॥ గీ॥ నీదుకరుణారసస్ఫూర్తి • నిశ్చయముగ,
నాపయింగల్గ నిట్టి కా•ర్యములభించె,
పరమముని ॥
సీ॥ గురుతరాంధ్రకవిత్వ • గుణవిశేషుండైన
వెంకయామాత్యుఁడే • వినుతుతాత
వరవిచిత్రకవిత్వ • వాగ్విజృంభణుఁడైన
కోటయామాత్యుఁడే • గుణునితండ్రి
నిరతాన్నదాన వ•ర్ణిత యశఃకౌముది
పున్నమాంబాసతే • పుణ్యుజనని
చెలఁగి కవీంద్ర సం•కలితమౌ; యామని
పురవరంబే భవ్య • భూరివసతి
తే॥ గీ॥ అట్టి గుడిపూడి వంశ సు•ధాబ్ధిచంద్రు
మద్గురునిఁ బూర్ణయామాత్యు • మదిఁదలంతు
పరమముని॥
సీ॥ బంగారుతళుకు దుం•ప్పటిమొలఁ బిగఁగట్టి,
కేలుఁదమ్మినిఁబిల్లఁ•గ్రోలునిల్పి,

బెడఁగారుగడు నెమ్మి ♦ పింఛెమ్ముఁ దలనుంచి,
చెవినిసంపెఁగపూవుఁ ♦ జివురుదుఱిమి,
సుందరంబుగ మొగ♦మందుఁగస్తురిఁ బెట్టి,
వనమ్మాలికల నక్కు ♦ నను నమర్చి,
పెనుమానికములఁ గూ♦ర్చిన యుంగరాల్ దాల్చి,
సన్న నా సెలగోలఁ ♦ జంకనుంచి,
తే॥ గీ॥ తోడిగోపాలబాలుర♦తో మెలంగి,
యాలపిందులఁగాచుచు♦నలరు వేల్పు,
పరమముని॥ 5

సీ॥ తొలిజామునందెంత ♦ వెలలేనిపున్నెంబు
గణియించెనో తాను ♦ కనులకబ్బ
మునుఁదా నలువవేల్పు ♦ నెనలేని పూజల
మెప్పించి బడసెనో ♦ మేలిపసిఁడి
తనమేన మెఱుఁగిడం ♦ గను శిల్పు సేవించి
వలసెనో జిగిఁగల ♦ తులసిసరము
పంక్తిరథోర్వీశు ♦ పట్టికశ్రమఁ జేసి
నగడి తానొందెనో ♦ నెమ్మిపింఛె
తే॥ గీ॥ మధరమున నాన; వెన్నాన; ♦ యక్కు నాన;
శిరమునందాన; నీదరిఁ ♦ జేరఁగాన
పరమ॥ 6

సీ॥ కమలాక్ష! నీనామ ♦ గానంబుఁ జేయని
పాటగాదది కీఱ్ఱు ♦ మోటగాని
శ్రీపతి! నీసేవఁ ♦ జేసి సుఖించని
తనువు కాదది పెద్ద ♦ తరువుఁగాని
కాంచనాంబర! నిన్నుఁ ♦ గన్గొనఁజాలని
కనులుగావవి నీటి ♦ దోనలుఁగాని
దనుజసంహార! నిన్నుఁ ♦ దవిలి పూజించని
హస్తముల్ తరుశాఖ ♦ లరసిచూడ

తే॥ గీ॥ నిన్నుఁదెలియని జన్మంబు ♦ నిశ్చయముగ
వ్యర్థమనితోఁచె నాహృద ♦ యాబ్జమందు
పరమ॥ 7

సీ॥ ఏమేటి; నిర్జర ♦ స్తోమంబునకు, సుధఁ
బోసి దైత్యాళిని ♦ బొంకుఁబుచ్చె
నేధీరుఁడిభరాజ ♦ బాధాపహారియై
గ్రాహగర్వ మడఁచె; నా ♦ గ్రహముమీఱ
నేకామి; గోపికా ♦ రాకాధిపాస్యల
కామాంధతమసంబుఁ ♦ గాకుఁ జేసె
నేశూరుఁడాస్రవా ♦ తిశు వే నింకించి
ధైర్యతవార్ధి బంధనము సలిపె

తే॥ గీ॥ అట్టి సమధిక బలశాలి ♦ వనుచుఁదెలిసి;
నమ్మియుంటిని నన్నుఁబ్రోవు ♦ నాగశయన
పరమ॥

సీ॥ కుటిలచేష్టితమైన ♦ ఘోరతాటకఁగూల్చి
గాధేయు సవనంబుఁ ♦ గాచినావు
ప్రస్తరంబును నీదు ♦ పాదరజంబుచే
శ్రీకంజనిభనేత్రిఁ ♦ జేసినావు
మాయాకురంగమౌ ♦ మారీచదైత్యుని
నేకశరంబున ♦ నేసినావు
యసమాన బలుఁడైన ♦ యావాలిఁదునుమాడి
యినపుత్రునకు రాజ్య ♦ మిచ్చినావు

తే॥ గీ॥ యట్టి భుజవిక్రముండ వీ ♦ వనుచుబుధులు
నుతినొనర్చుట వింటి సంద్గతియునీవె
పరమ॥

సీ॥ నీనామమే; దాస ♦ నికరంబులకునెల్ల
రాజితంబగు సార ♦ భూజమరయ
నీయభిదానమే; ♦ నిరుపమ దుష్కర్మ
కాననంబునకు, మహానలంబు
నీయాఖ్యయే; శత్రు ♦ నివహ ద్విపాళికి
హర్యక్ష దర్శనం ♦ బనఁగఁదనరు

నీనామధేయంబు ♦ నిర్జరారులకెల్ల
బహుభీషణంబగఁ ♦ బరఁగుచుండు
తే॥ గీ॥ సహహా? భవదీయ లలితాహ్వ ♦ యంబుమహిమ
పొగడ బ్రహ్మాదిముఖుల శక్య ♦ మగున శౌరి
పరమ॥ 10

సీ॥ అన్నకు వెఱ్ఱి నీ♦ళ్ళరుదుమీర నొసంగి
దవిలి క్షీరము వేడ్కఁ ♦ ద్రావినావు
కలివల్వఁదోఁబుట్టుఁ ♦ గట్టనిచ్చికడింది,
కాంచనాంబరము; మైఁ ♦ గప్పినావు,
యగ్రజునకు; వేగ ♦ హాలమాయుధముఁ జేసి,
బటువుఁగైదువుఁ జేత ♦ బట్టినావు,
తగఁబెద్దవానికిఁ ♦ దాళధ్వజంబిచ్చి,
తార్క్ష్యపతాకంబుఁ ♦ దాల్చినావు,
తే॥ గీ॥ ధర్మమా? నీకుఁ జేతలుఁ దలఁచిచూడ,
నన్నుఁబ్రోవవు నీకిది ♦ న్యాయమగునె,
పరమ॥ 11

సీ॥ పాంచాలిసభలోన ♦ భంగమొందుచునిన్నుఁ ,
బ్రార్థింపఁ గాచితి ♦ వను టబద్ధు,
గజరాజుమకరిచేఁ ♦ గడుబాధనొందుచు,
నినువేడఁబ్రోచితి ♦ వనుటబొంకు,

హితుఁడుఁ కుచేలుండు • యతిమోదమున నిన్ను
వినుతింప, ధనమిచ్చి • తనుటకల్ల,
ప్రహ్లాదురక్షింప • వరమర్త్యహార్యత,
మైతి వంచనుమాట • యదిహుళక్కి,
తే॥ గీ॥ యిట్టిచెయ్వులు నిజములో • యిచ్చకములో,
నన్నుఁబాలింప సత్యమం• చెన్నువాఁడ,
పరమముని॥ 12

సీ॥ నీవాయారము, నీటు • నీదుచాతుర్యంబు,
గోపికాజనులకు • గొప్పయగును,
నీదుకారుణ్యంబు • నీరాటబాధిత,
మాతంగమునకు; శ్రీ • మహితకరము,
నీచెల్మిసౌభాగ్య • నిశ్చలత్వంబెల్ల,
జంభారిసుతునకు • జృంభణంబు,
నీవిస్ఫురద్బాహు • నిపుణత్వమెల్లను,
నిర్జరాధిపునకు • నిలువనీడ,
తే॥ గీ॥ పరగనీకృపఁజెందని • పరులకేమి,
క్షేమతరముగనుండునో • చెప్పుమయ్య,
పరమముని॥ 13

సీ॥ పదియారువేల గో • పస్త్రీల రమియింప,
జారుఁడితండను • జాడదోఁచెఁ

బలిగృహంబున వెన్న ♦ భక్షించుకతమునఁ
జోరుండవనుచు, ని ♦ స్సారమొదవెఁ
దొల్లి జరాసంధుఁ ♦ ద్రెళ్ళింపభీముచేఁ,
గ్రూరచేష్టితుఁడను ♦ కోర్కెగల్గె
నమరులకిడి సుధ♦ నసురుల కిడకుంట,
బక్షపాతివటంచుఁ ♦ బరగదెలిసె
తే॥ గీ॥ నిట్టినీచేతలెల్లఁగ♦నృట్టుచుండ
నిత్యసత్యుండవందురు ♦ నీతివిదులు
పరమముని॥ 14

సీ॥ అమ్రఫలాపేక్ష ♦ నలరుచుండుశుకంబు
వలయునే యుమ్మెత ♦ పండులెవుడు
మందారమకరంద ♦ మందుఁదేలెడి,బంభ
రముబోవునే; తుమ్మ ♦ ప్రూకులకును
ఘనమైన శృంగార ♦ వనవిహారిణియగు
చొక్కమా కోయిల ♦ చొరునె యటవిఁ
బూర్ణేందుకౌముది ♦ భుక్తియొనర్చెడి
ఘనచకోరము వనం♦బునకుఁ జనునె
తే॥ గీ ॥గాననీభక్తిచే ముక్తిఁ♦గాంచునరుఁడు
యితర జేజేలకును మ్రొక్క ♦ వెల్లబద్ధ
పరమముని॥ 15

సీ॥ కౌంతేయులనురక్ష • కత్యంబొనర్చుట
పాంచాలిభంగంబుఁ • బాపుటయును
నక్రగర్వమడంచి • నాగేంద్రుఁగాచుట,
ఘన కుచేలునకతి•కలిమి నిడుట
యామ్నాయ తస్కరు • హతమొనరించుటఁ
బరమేష్ఠికినిఁ దోలు•పల్కులిడుట
సుతుదండనముఁజేయు • మతిహీనుఁద్రుంచుట
నుక్కుకంబమునందు • యుదయమగుట

తే॥ గీ॥ నీకుఁదగు నిట్టి కృత్యముల్ • నెంచవచింపఁ
బంచముఖునకు వశమె యో • పరమపురుష
పరమముని॥ 16

సీ॥ భవదంఘ్రులేకదా? • భక్తారిజలదముల్
బాపుట కమిత ప్రభ•భంజనములు
భవదంఘ్రులేకదా? • భయదకిల్బిష నాగ
తతులకు నీల కం•ధరములరయ
భవదంఘ్రులేకదా? • భార్గవీ కిసలయ
సౌమ్యహస్తయుల నర్చనలుఁగొనుట
భవదంఘ్రి లేకదా? • పరమార్యనరులకు
[illegible]

తే॥ గీ॥ అట్టి నీపాదసేవనం ♦ బనవరతముఁ
జేసిననుఁ బ్రోవవేమయ్య ♦ శేషతల్ప!
పరమ॥ 17

సీ॥ కాళ్యాననుఁగుఱియు; గో ♦ రాజిఁగాచుటకునై
గోత్రంబు నెవఁడు తా ♦ గొడుగుఁబట్టెఁ
గానినంబుదహించు ♦ కార్చిచ్చు నవలీల
భక్షించె నెవ్వాఁడు ♦ ప్రౌఢిమీఱ
భూపవర్గము చూడ ♦ భూరి బలాఢ్యుఁడై
వైదగ్ధి నెవ్వాఁడు ♦ వడిగఁదెచ్చెఁ
బరికింప నలువ గో ♦ వారంబుఁగొనిపోవఁ
బ్రతిసృష్టి నెవ్వాఁడు ♦ ప్రతిఘటించె

తే॥ గీ॥ భళిర? నీధైర్య దివ్యప్ర ♦ భావమెన్న
నజభవాసికములకైన ♦ నలవియగున
పరమ॥ 18

సీ॥ తొలుత నీసతికి నైనఁ ♦ దోడాటచేఁగదా
విధుఁడుఁ దా రాజను ♦ వినుతిఁజెందె
ఘనమొప్ప నీపత్ని ♦ గాంచినంత నెకదా
వారాశిరత్న నివాసమయ్యె
దండిగ నీకునం ♦ దనుఁడౌటఁజేఁగదా
మారుండు సుందరా ♦ కారుఁడయ్యెఁ

దడయక సీస్నేహి ♦ తముం జేయ నేంగదా
కదుం గుచేలుండు; సిరిం ♦ గాంచ నయ్యె
తే॥ గీ॥ నహహా? భవదీయ దివ్యమ ♦ హత్వమెన్నం
దరమె శేషాహికైన; భ♦క్తప్రసన్న!
పరమ॥ 19

సీ॥ కత్త్రిసారధివినై ♦ గుఱ్ఱముల్ నడుపుచుం
గడిమి పాతనిం బ్రోవ ♦ ఘనముంగాదు
ఘోరాహి శయ్యంగాం ♦ గొనిన కతంబున
ధీరతాయనకీయం ♦ దిరముంగాదు
స్నేహంబు నూహించి ♦ నెఱిం గుచేలునిం గాంచి
యతనికి ధనమీయు ♦ హితముంగాదు
కుబ్జావధూటిపైం ♦ గొంక లేని మోహివై
త్రైవక్రతనుం బాపం ♦ దగవుంగాదు
తే॥ గీ॥ కాన బహు పాపసంగతుం ♦ డైనవాని
నన్ను దరిజేర్చిం బ్రోచుట ♦ నయము నీకు
పరమ॥ 20

సీ॥ నిలిచినచోటను ♦ నిలువక వర్తించు
భార్గవీదేవినీ ♦ భార్యగాదె
పాంథులం బట్టి పె ♦ న్బాధలొనర్చెడి
పంచశరుండు నీ ♦ పట్టిగాదె

కలుషంబనకఁదానుఁ ♦ గామారిశిరమెక్కు
సుర మహానదినీకు ♦ సుతయగాదె
కల్లునీళ్ళన్నుద్రావు ♦ తెల్లనిమైదంట
యరసిచూడఁగనీవు ♦ యన్నగాఁడె
తే॥ గీ॥ యారసీవారిమర్యాద ♦ లన్నిఁదెలిసి
సద్గుణుండని నినుఁబల్క ♦ సరసమగునె
వరమ॥ 21

సీ॥ నీప్రజ్ఞ; వైనతేయ ♦ నివహంబులోపలఁ
దరుణీత్వమొందఁదాఁ ♦ దలఁచె? నటకు
నీబుద్ధి; భూమీశ ♦ నికురంబములఁజూడ
వైదర్భిఁగొనిపోగ ♦ వంగె? నటకు
నీగొప్ప; నిక్కంపు నలఁత యంఘ్రులుద్రొక్కఁ
బదతాడనముఁజేయఁ ♦ బడియె? నచట
నీశక్తి హేమాక్షు ♦ నేపడంచుటకునై
పందిరూపముఁదాల్చ ♦ బలచె? నటకు
తే॥ గీ॥ నట్టి సిళఁగములనెల్ల ♦ గుట్టుఁబెట్టి
బెట్టుఁజూపెద వేమయ్యా? ♦ గట్టుఁదాల్ప!
వరమ॥ 22

సీ॥ వివరింపగను లచ్చి ♦ విరివిగ భార్యమై
శ్రీమంతుఁడను కీర్తిఁ ♦ జెలఁగఁజేసెఁ

శాత్రవభీకర ♦ చక్రమహాయుధమయి
దనుజాంతకుండను ♦ ఘనముఁ దెచ్చె
నద్భుతగుణుఁడు; ప్ర ♦ హ్లాదుండు; భక్తుఁడై
భక్తరక్షణుఁడను ♦ శక్తిఁ దెచ్చె
వైనతేయుండు నీ ♦ వాహనంబై తాను
గరుడవాహనుఁడను ♦ గణుతిఁ దెచ్చెఁ
తే॥ గీ॥ గాన వారలచే నీకుఁ ♦ గల్గె; యశము
తెలియరే? సూరిజనులు నీ ♦ దివ్యబుద్ధి
పరమ॥ 23

సీ॥ నిర్జరాధిపవంద్య! ♦ నిరుపమాన గుణాయ!
వారణేంద్రవిపన్ని ♦ వారణాయ!
సనకాది మౌనీంద్ర ♦ సన్నుతచరణాయ!
ఘోరదైతేయ సం ♦ హారణాయ!
హరవిరించి, స్వర్శ ♦ నా, మర, స్మరితాయ!
భక్తసంసేవ్య! సం ♦ పత్ప్రదాయ!
యతులితశత్రు ని ♦ ర్జిత! శౌర్య నికరాయ!
జనకజాహృదయాబ్జ ♦ షట్పదాయ!
తే॥ గీ॥ శేషశయనాయ! త్రైలోక్య ♦ సేవితాయ!
పాపహరణాయ! వైకుంఠ ♦ పట్టణాయ!
పరమపురుష॥ 24

సీ॥ అతిగర్వమానసుఁ ♦ డైన కంసునిఁబట్టి
హతమొనరింపనీ ♦ కలరుఁగాక,
స్తనలిప్తగరళయై ♦ చనుదెంచు; పెనురక్క-
సిని హరింపఁగ నీకె ♦ చెల్లుఁ గాకఁ,
బరికింపముని శాప ♦ బద్ధులౌ మద్దుల,
ధరణిఁగూల్పఁగ నీకె ♦ తగునుగాక,
మార్గాన గదిసిన ♦ మాతంగవిభుప్రాణ,
హరణంబొనర్ప నీ ♦ కబ్బుగాక,
తే॥ గీ పరులు సామర్థ్యులె? యిట్టి ♦ పనులఁ జేయఁ,
గాన నిను నెంచశక్యంబె? ♦ కమలనేత్ర,
పరమముని॥ 26

—* ఏతత్ గ్రంథకర్తృ వంశావళి *—

సీ॥ ధర, కౌత్తవంశాబ్ధి ♦ తారాధిపతియైన,
సుబ్బయాఖ్యుండను ♦ సుగుణధనుఁడు,
నరసమాంబను పేర ♦ నలరారు యువతినిఁ
బరిణయంబందియుఁ ♦ బ్రౌఢిమీఱ,
నామెయందత్యంత ♦ నీమమెలర్పంగఁ
బుత్రద్వయము నొక ♦ పుత్త్రిఁగనియె,
నందగ్రతనయుండు ♦ బంధురగుణధుర్యుఁ
డును ; పున్నయాఖ్యుఁ ♦ దనరుచుండు,

తే॥ గీ॥ నతనియనుజుండ, "శ్రీరాముల"నెడివాఁడ,
నల్పితినినీదు కృపను "నక్షత్రమాల"
పరమముని॥

సీ॥ మంగళమస్తు, సామజరాజనుతశీల!
మంగళమస్తు, భుజంగశయన!
మంగళమస్తు, సన్మానిమానసభృంగ !
మంగళమస్తు, మన్మలినభంగ!
మంగళమస్తు, కామారిసన్నుతపాద!
మంగళమస్తు, రథాంగహస్త!
మంగళమస్తు, కోమల దివ్యవిగ్రహా !
మంగళమస్తు, పతంగవాహా!
తే॥ గీ॥ మంగళము నీకు, త్రైలోక్య మహిత తేజ!
మంగళమునీకు, సంశ్రితామరమహీజ !
పరమమునిపోవ రావికంపురనివాస,
పాకవైరినుతాంఘ్రి గోపాలకృష్ణ!

సంపూర్ణము.